# డా. రావూరి భరద్వాజ
## - సాహిత్య సమాలోచనం

# Dr. Ravoori Bharadvaja
## (Saahitya Samaalochanam)



సంపాదకులు

వి. వింధ్య వాసినీ దేవి

# డా. రావూరి భరద్వాజ
# - సాహిత్య సమాలోచనం

## Dr. Ravoori Bharadvaja
## (Saahitya Samaalochanam)

గౌరవ సంపాదకులు
**డా॥ యం. పురుషోత్తం రెడ్డి**

సంపాదకులు
**వి. వింధ్య వాసినీ దేవి**




# తెలుగు అధ్యయన శాఖ

కె.వి.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల

కర్నూలు, ఆంధ్ర ప్రదేశ్

**National Seminar on Ravoori Bharadvaja Sahithya Samaalochanam**

**First Edition - 2015**


ISBN : 978-93-85101-04-5

Price : ₹ **450/-**

**Winger Publications**
3-5-1105, 2nd Floor, PVR Estates, Behind Hero Honda Showroom, Narayanaguda, Hyderabad-500 029.
Phone: 040-64554822.

***Sales Offices :***

**Hyderabad**
3-5-1105, 2nd Floor, PVR Estates, Behind Hero Honda Showroom, Narayanaguda, Hyderabad-500 029.
Phone: 040-64554822.

**Visakhapatnam**
# 43-18-19/1, Krupa Residency, Venkatarjuna Nagar, Dondaparthy, Visakhapatnam - 530 016. Andhra Pradesh. Ph: 9490708474.

**New Delhi**
C/14, SDIDC Work Centre Jhilmil Colony, New Delhi-100095. Phone: 011-22162365.

paramountpublishers@gmail.com | alluriasr2005@yahoo.com

Published by Krishna Prasad Alluri for Winger Publications and printed by him at Sai Thirumala Printers.

# విషయసూచిక

జ్ఞానపీఠ పురస్కారం పొందిన తొలి నవల

# "పాకుడు రాళ్ళు నవల - మంజరిపాత్ర - మనోవిశ్లేషణ"

శ్రీ ఎస్. శ్రీనివాసరావు

పరిశోధక విద్యార్థి మరియు ఉపాధ్యాయుడు, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు.

## ఉపోద్ఘాతము

తెలుగు నవలా చరిత్రలో 1940 నుండి ఆధునికయుగం ప్రారంభమైందని చెప్పాలి. 1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతనే ప్రారంభమైంది. 19వ శతాబ్దం చివరి భాగంలో మనస్తత్వశాస్త్రం కొత్తపుంతలు తొక్కింది. దీనికొక రూపాన్ని, సమగ్రమైన సిద్ధాంతాలను రూపొందించినవాడు సిగ్మండ్ ఫ్రాయిడ్. ఆ తర్వాత యూంగ్, ఆడ్లర్ ఆధునిక నవలా సాహిత్యాన్ని ప్రభావితం చేశారు. ఫ్రాయిడ్ మనస్సును విశ్లేషిస్తే, కార్ల్‌మార్క్స్ ఆర్థిక సంబంధాలను విశ్లేషించాడు. తెలుగు నవలా సాహిత్యంలో గొప్ప నవలలు ఉన్నాయి అని నమ్మితే అట్లాంటి గొప్ప నవలల్లో డా॥ రావూరి భరద్వాజ గారు రచించిన "పాకుడు రాళ్ళు" నవల ఒకటి. ధనం, కీర్తిప్రతీష్టలే లక్ష్యంగా సినిమా రంగంలో నటిగా అడుగుపెట్టి ప్రతిమలుపులను మానసిక సంఘర్షణకి గురైన "మంజరిపాత్ర మనో విశ్లేషణ" చేయడమై ప్రస్తుత వ్యాసం ఉద్దేశం. కవి పరిచయము :- 2012 సం॥లో 48వ జ్ఞాన పీఠ్ పురస్కారాన్ని అందుకున్న 86 ఏళ్ళ డా॥ రావూరి భరద్వాజ గారు జీవితమనే బడిలో అనుభవాలనే పాఠాలద్వారా మహోన్నత శిఖరాలు అధిరోహించినారు. ది 05-07-1927న మల్లికాంబ, కోటయ్య పుణ్య దంపతులకు భరద్వాజగారు జన్మించారు. స్వస్థలం పరిటాల జాగీరుకు చెందిన మొగలూరుగ్రామం. ఆ తరువాత గుంటూరు జిల్లాలోని తాడికొండ గ్రామానికి వలస వెళ్ళారు. ఒక సామాన్య రైతు కుటుంబంలో పుట్టి 7, 8 తరగతులే చదువుకొని జీవన పోరాటంలో రోజువారీ కూలీగా, కమ్మరిగా, వడ్రంగిగా, రంపం లాగే కుర్రాడిలా, పేపర్ బాయ్‌లా, ప్రూఫ్‌రీడర్‌లా విభిన్న పత్రికల్లో, ఆకాశవాణిలో, చలన చిత్ర పరిశ్రమలో వివిధ సేవలిందించి పిడికెడు మెతుకులకోసం అక్షరాన్ని నమ్ముకున్న అపర భగీరథుడు భరద్వాజ. తన 17వ ఏటనే రచనావ్యాసంగం ప్రారంభించారు. 1944 నుంచి ఇప్పటి వరకు 70 ఏళ్ళ సుదీర్ఘ సాహితీ వ్యాసంగంలో 37 కథా సంపుటాలు, 17 నవలలు, 6 నవలికలు, 10 నాటకాలు, 5 పిల్లల కథా సంపుటాలు, 5 స్మృతి కావ్యాలు, విజ్ఞానశాస్త్ర గ్రంధాలు, దిన చర్యలు, అముద్రిత రచనలు ఇంకా వెలుగు చూడాల్సి ఉంది. సామాన్య రచయితల మధ్య అసామాన్య రచయిత రావూరి. పాకుడురాళ్ళు నవలా పరిచయం :- తెలుగువాడికోసం తెలుగువాడు రాసిన నవల "పాకుడురాళ్ళ" ఏ రచయిత చూపులకు తగలని సామాజిక కోణాలే ఈ రచయిత రచనలకు వస్తువు. 2012 సం॥నికి గాను "పాకుడురాళ్ళు" నవలకు భారతదేశంలో నోబెల్ బహుమతి అనదగిన అత్యంత ఉన్నతమైన జ్ఞానపీఠ సాహిత్యపురస్కారం 11, అక్టోబర్ 2013న ఢిల్లీలో లభించింది. మొదట్లో 1961-63 సం॥ల్లో కృష్ణా పత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడింది. 1978లో మొదట కమలా పబ్లిషింగ్ వారు పుస్తకంగా ప్రచురించారు. మొదట దీన్ని పాలపుంత అనే కథానికగా రాశారు. ఆ కథను పెంచి నవలగా రచించారు. భరద్వాజరాగు ఈ నవలకు మొదట "మాయజలతారు" అను పేరు పెట్టారు. కానీ శీలా వీర్రాజు దీనికి "పాకుడురాళ్ళు" అని పేరు మార్చారు. సినిమా ప్రపంచంలో జీవితాన్ని అన్ని కోణాల్లోంచి దర్శించి వెలువడిన ఒక మహత్తర వాస్తవిక నవల ఇది. భరద్వాజ ఉద్యోగరీత్యా 3 1/2 సం॥లు మద్రాస్‌లో ఉన్నారు. నిర్మాతలు, దర్శకులు, నటీనటులు, తారల పొందుకోసం ఆరాటపడే లోఫర్లతో సన్నిహిత సంబంధాలేర్పడ్డాయి. 31/2 సం॥లు సేకరించిన సమాచార సమాహారమే పాకుడురాళ్ళు నవల. సినీ ప్రపంచాన్ని ఇంతలోతుగా, ఇంత నిశితంగా, ఇంత స్పష్టంగా చిత్రించిన పెద్ద నవలగా రావడం భారతదేశంలోనే ప్రప్రథమం.

ISBN : 978-93-85101-04-5

## మనస్తత్వశాస్త్రం

ప్రతి వ్యక్తి అంతరంగానికి లేక మనస్సుకు మూడు అరలుంటాయని సిగ్మండ్ ఫ్రాయిడ్ చెప్పాడు.

1. చేతన :- అంటే మనకు తెలిసే భాగం
2. ఉపచేతన :- మనం నిద్రపోతున్నప్పుడు మనకొచ్చే కలలు
3. అంతశ్చేతన లేక సుప్త చేతన :- ఇక్కడేంజరుగుతున్నదో, ఇక్కడ ఏయేశక్తులు సంచరిస్తున్నాయో మనకు తెలియదు. మన మనస్సులో ఎక్కువ భాగాన్ని ఆక్రమించేది

ఈ అంతశ్చేతనే అంటాడు సిగ్మండ్ ఫ్రాయిడ్. ప్రతి వ్యక్తిలోనూ స్త్రీ కావచ్చు, పురుషుడు కావచ్చు రెండు ప్రపంచాలుంటాయి. 1 బాహ్య ప్రపంచం, 2. అంతరంగ ప్రపంచం.

సమాజంలోని చెడు కంతటికీ కారణం సమాజమే మనిషి స్వతహాగా మంచివాడే అన్న అభిప్రాయాన్ని ఛేధించిన మొట్ట మొదటి మేధావి సిగ్మండ్ ఫ్రాయిడ్. మానవ సంబంధాలన్నీ ప్రధానంగా ఆర్థిక సంబంధాలే. స్వాతంత్ర్యానంతరం వెలువడిన నవలల్లో రచయితలు పాత్రల అంతరంగ సంఘర్షణల్ని సంక్షోభాల్ని ఆవిష్కరించారు. పాకుడురాళ్ళు నవలలో ప్రధానపాత్రయైన మంజరి మానసిక సంఘర్షణల్ని చక్కని నవలా శిల్పంతో రక్తి కట్టించారు భరద్వాజ.

## మంజరిపాత్ర మనోవిశ్లేషణ

తెలుగులో వెలువడిన ప్రప్రథమ "నేచురలిస్ట్ నవల"గా పాకుడురాళ్ళు పేరు ప్రతిష్టలు గడించుకొంది. పాకుడురాళ్ళు నవలలో ప్రధాన స్త్రీ పాత్ర మంజరి. నవల ప్రారంభంలోని మంగమ్మ తర్వాత మంజరిగా మారింది. మంజరి ఆయా పరిస్థితుల్లో తన అభిమతానికి విరుద్ధంగా ప్రవర్తిస్తుంది. తన మనసుపై తనకే అదుపులేని పరిస్థితులను ఎదుర్కొంటుంది. ఈమె నాగమణి వద్ద ఉన్నప్పటికంటే నాటక సమాజంలో చేరిన తరువాత మానసిక తృప్తిని అనుభవిస్తుంది. రాజమణి, వసంతలను తన ఆత్మీయ బంధువులుగా భావించింది. చలపతి సినిమారంగానికి పరిచయం చేస్తానని మద్రాస్ తీసుకొని వెళ్తాడు. రాతిని తెచ్చి రత్నాల సరసర ఉంచారని మాయామర్మం, మోహంకప్పని స్వచ్ఛమైన అభిప్రాయాన్ని వెల్లడిస్తుంది. నీతి, నిజాయితీతో బ్రతకాలన్న అకాంక్ష మంజరిలో బలీయంగా ఉంది. కానీ చలపతి చూపిన మార్గం అందుకు విరుద్ధంగా ఉంటుంది. రోజుకొకరితో పంచుకొనే జీవితం దుర్భరమైనదిగా భావించి ఆమె తన మనసును చంపుకొని వేదనను అనుభవించింది. ఆసమయంలో నాగమణి, వసంత, రామచంద్రం, మాధవరావుల ఆత్మీయతకోసం ఆరాటపడే మనసు బహిర్గతమవుతుంది. సినిమా పరిశ్రమలో అడుగుపెట్టిన దగ్గర నుండి కృత్రిమమైన విలువలకోసం ప్రాకులాడుతుంది. స్నేహమాధుర్యంతో కళ్యాణికి ఆప్తురాలవుతుంది. ఆమె ఆర్థిక స్తోమత పెరుగుతున్న దశలో విరాళాలు విరివిగా ఇచ్చింది. రెండు అనాథ శరణాలయాలు ఆమె పేరుతో నడుస్తున్నాయి. బ్రతికిన నాలుగురోజులు డబ్బుతో వచ్చే ఆనందాలను అనుభవించాలనుకొంటుంది.

రాజన్, ప్రసాద్, వెంకటేశ్వర్లు, కిషన్‌దాస్, సక్సేనా మొ॥ ఎందరో కొత్త వ్యక్తులతో పరిచయంతో ఆమె తన మనస్సు చంపుకొని చెయ్యరాని పనులు చేస్తుంది. తనకు కావలసిన ఇల్లు తనకు చెందడం కోసం సక్సేనా సహాయం అర్థించింది. ప్రతిఫలంగా బ్లూ ఫిలింలో నటన, సక్సేనా బ్లాక్ మెయిలింగ్, వెంటనే మంజరి ఆత్మహత్య నవల ముగింపు.

మంజరి పాత్రలో నటి సావిత్రి, కాంచనమాల, మీనాకుమారి, మార్లిన్ మన్రోలు ఉండవచ్చు. ఈ నవల రాసిన తర్వాత కూడా సిల్క్‌స్మిత, దివ్యభారతి, సౌందర్య, కాంచన, అంజలి మొ॥ మరణించారు. మాధవరావు అన్న పాత్ర ఆత్మ కథనంతో నవల ప్రారంభమై, చివరికి అతడే ఈ నవలను ముగించేస్తాడు. మంజరి అతిసామాన్య స్థితినుండి ఒక మెట్టు తరువాత మరోమెట్టును అధిరోహిస్తుంది.

ఇక ఆమె ఎక్కవలసిన మెట్టేలేదు. అయితే ఆమె ఎక్కిన మెట్లన్నీ "పాకుడురాళ్ళు" అని ఆమెకు తెలియదు.

జీవితంలో విషాదం డబ్బులేకపోవడం కాదు. "మనల్ని ప్రేమించేవాళ్ళు లేకపోవడం మనం ప్రేమించడానికి ఎవరూ దొరక్కపోవడం" అని మంజరి చివరి ఘడియల్లో అన్నమాటలు ఆమె వ్యక్తిత్వానికి నిదర్శనం. మంజరి భూమిపై పుట్టింది, ఆకాశానికెగిరింది, పాతాళంలోకి జారిపోయింది. మనస్తత్వశాస్త్రం ప్రకారం మనసులో అనేక సంఘర్షణలకు గురైన వ్యక్తి ఎవరైనా చివరికి ఆత్మహత్యే వారికి శరణ్యమవుతుంది. ఈ నవలలోని

ప్రతి సంఘటనలోను, సన్నివేశంలోను, సంభాషణల్లోను, పాత్రల్లోను మనస్తత్వశాస్త్రం ప్రతిబింబిస్తుంది.

మంజరి సినిమారంగంలో అడుగుపెట్టడానికి చేసిన ప్రయత్నాల దగ్గర నుంచి అంతంవరకు పాకుడురాళ్ళు నవల అంతా సినిమా ప్రపంచమే. మంజలి శృంగార రసమంజరిగా మద్రాసు, బొంబాయి నగరాల్లోని భక్తులనూ, రక్తులనూ, సినీశక్తులనూ వలయాకారంగా తనచుట్టూ తిప్పుకొన్న మధుభ్రమరిగా చిత్రించబడింది. మంజరి సినీరంగంలో ప్రముఖ తారగా వెలుగొందాలనే నిర్ణయింతో నీతినియమాలకు తిలోదకాలిస్తుంది.

మనిషికి, మనిషి మనస్సుకి, శరీరానికి విలువ లేదనేది కఠోరమైన సత్యం. ఈ నవలలోని పాత్రల బహిర్, అంతర సంఘర్షణల ఫలితమే ఈ నవల. వ్యక్తియొక్క సామాజిక జీవితం వేరు, అంతరంగ చైతన్యం వేరు. వ్యక్తిలో స్వార్థ ప్రబోధం ఎక్కువైనపుడు అంతరంగంలోని మానవతను బహిర్ ప్రవృత్తి జయిస్తుంది. సినీరంగంలో సర్వసాధారణంగా జరిగేదిఇదే. సినీరంగమే కాకుండా ఆమె అనుసరించిన, అడుగు పెట్టిన మార్గాలన్నీ ఆమెను పతనం చేసే పాకుడురాళ్ళే అయ్యాయి. పురుషులకు స్త్రీ అనుభవించే వస్తువుగానే కనిపిస్తుంది కానీ ఆమె ఆత్మ, హృదయం, మనస్సు, ఆలోచనలు, ఇష్టాయిష్టాలు కనిపించవు. మంజరి పాత్రను రావూరుగారు యథార్థంగా రక్తమాంసాలున్న వ్యక్తిగా సజీవపాత్రగా చిత్రీకరించారు.

## నేటి సినిమారంగం

సినిమాను ఒక కళగా కాక వ్యాపారంగానే భారతీయులు చూశారు. సినిమారంగంలో సత్యజిత్‌రే, మృణాళ్‌సేన్, బెనెగల్, నరసింగరావు వంటివారు తగ్గిపోయారు. సేఠ్‌లు, లాలాలు, పొగాకు వ్యాపారులు కళాతృష్ణతో కాక డబ్బు సంపాదించాలనే ఆశతో చిత్రించటం జరిగింది. కొంత డబ్బును పెట్టి డబుల్ డబ్బును సంపాదించాలనే వ్యక్తులే ఎక్కువ. సినిమా తారలంకావాలని వచ్చే స్త్రీల శరీరాలే పురుషులకు కనిపించాయి. స్త్రీలు శరీరాలు అర్పించినప్పుడే నటించే అవకాశాలివ్వటం జరుగుతుంది.

## ముగింపు

సినిమారంగంపై ఆకర్షణతో స్టార్‌నవుతానన్న ఆశతో మద్రాస్ పోయి మోసపోయి తిండిలేక మలమల మాడుతూ వేశ్యలుగా, కాల్ గరల్స్‌గా యువతులు మారిపోతున్నారు. సినిమా జగత్తులో అన్నీ పాకుడురాళ్ళే. అడుగడుగునా జారిపడుతూ లేస్తూ జీవితం గడపడమే. సినిమా తారల అంతరంగికమైన విషాదాన్ని, సినిమా రంగంలోని జీవితాలను, రాజకీయాలను, కుళ్ళును, విషాదాలను, ప్రేమ రాహిత్యాన్ని, అభద్రతను వాస్తవికంగా చిత్రించారు భరద్వాజ. అశ్లీలత లేకుండా మంజరి, కళ్యాణి తమ దేహాలను దోపిడీకి గురిచేసిన ఘట్టాలను చాలా నేర్పుగా శృంగార దృశ్యాలు లేకుండా కథను నడిపారు. ఎక్కడా అశ్లీలత లేకుండా ఎన్నో యదార్థ సంఘటనలను చెప్తూ రచించారు. భారతీయ సినిమా వందేండ్ల పండుగ జరుపుకుంటున్న తరుణంలో పాకుడురాళ్ళు నవలకు జ్ఞానపీఠ్ అవార్డు రావటం చాలా సముచితంగా ఉంది.


ISBN : 978-93-85101-04-5